Khawateen ka Husoole Maash
Hudood Aur Taqaze
(Telugu)

# మహిళల ఉపాధి
## పరిధులు, అవసరాలు

మూలం
**డాక్టర్ షహ్నాజ్ బేగం**

అనువాదం
**ఎస్.ఎమ్. ఖాద్రి**

అనంతకరుణామయుడు అపార కృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో

# మహిళల ఉపాధి
# పరిధులు, అవసరాలు

డబ్బు సంపాదించే పిచ్చి ప్రతివాణ్ణి పట్టిపీడిస్తోంది. పురుషుడైనా, స్త్రీఅయిన డబ్బు సంపాదనలో సతమతమైపోవడం ఈ భౌతికకాలపు ఓ అలవాటు. ఇది డబ్బుకాలం. అబ్బాయి కానివ్వండి, అమ్మాయి కానివ్వండి, విద్యార్థి దశను పూర్తి చేసుకోగానే వారు తమ కేరీర్‌ను నిర్ణయించుకునే ప్రయత్నాలు ప్రారంభిస్తారు. తమ కలలను పండించుకోవడానికి, తమ తల్లిదండ్రులు లేదా సంరక్షకుల ప్రోద్బలంపై, తమ కేరీర్ నిర్మాణానికే కృషి చేస్తారు. కొన్ని సంవత్సరాల తరువాత వారు కన్న కలలు సాకారం కూడా అవుతాయి. చివరికి తమ ప్రయత్నం వల్ల వారికి ఓ మంచి ఉద్యోగమూ లభిస్తుంది. ఇక వారికి ఈ లోకంలోనే స్వర్గం పొందినంత అనుభూతి కలుగుతుంది. వీరి ఈ ప్రయత్నానికి కారణం ఏదై ఉంటుంది? అన్నిటికంటే ముందు ఓ ప్రాథమిక యదార్థాన్ని గుర్తుంచుకోవాలి. నేటి మానవుని ఆలోచన పూర్తిగాకాకపోయినా చాలామట్టుకు పాశ్యాత్యుల భావబానిసత్వానికి లోనై పోయింది. పాశ్యాత్య దేశాల పోకడలు, సిద్ధాంతాల ప్రభావం మనిషి జీవితంపై తీవ్రంగా పనిజేస్తోంది. అతను తన జీవితంలో ఎదురయ్యే సమస్యల పరిష్కా రాలన్నింటిని పాశ్యాత్యుల దృష్టికోణంతోనే ఆలోచిస్తున్నాడు. దాని ప్రకారమే నడుచుకుంటున్నాడు. దీని ఫలితంగా అతనికి ఇస్లామ్ గురించి పూర్తి అవగాహన ఏర్పడడంలేదు. ఇస్లామీయ విలువలేమిటో అర్థం చేసుకోవడమూ లేదు. ఇక ఏ చిన్నాచితకా సమస్య ఎదురైనా నేటి ముస్లిం, పాశ్చాత్య భావాలనే దృష్టిలో పెట్టుకొని అవే మేలైనవిగా భావిస్తున్నాడు.

ఇస్లామ్ ధర్మం ఏ సమాజ నిర్మాణ విధానాన్నైతే చూపించిందో దాని కార్యాచరణమైన, సకారాత్మకమైన ఏ మచ్చూ నేటి ప్రపంచంలో కానరావడం లేదు. కాబట్టి పాశ్చాత్య భావబానిసత్వానికి దాసుడైపోయిన ఓ ముస్లిమ్, ఆ సమాజం తిరిగి ఉనికిలోకి వస్తుందని భావించడంలేదు, ముస్లిమ్ సమాజానికి సంబంధించిన కొన్ని సమస్యలను (అవి ముస్లిముల ఉపేక్ష కారణంగా, ధర్మం పట్ల వారు అనుసరిస్తున్న వైఖరి కారణంగా పుట్టేవి) సాకుగా తీసుకొని, స్వయం ముస్లిం సమాజమే ఆ ఇస్లామీయ చట్టాలను పరిహాసానికి గురిచేయడం జరుగుతుంది. ఇతరులు ఇస్లామీయ చట్టాలను అవహేళనకు గురిచేస్తుంటే, ఇలాంటి ముస్లిములు ఆ అవహేళనకు వంతపాడుతున్నారు. నేడు ముస్లిము లలో స్త్రీలహక్కుల పరిరక్షణ ఎక్కడో ఒకచోట అమలు జరుగుతున్నా, వారి ఇస్లామ్ వ్యతిరేక ధోరణి కారణంగా ఇస్లామ్ పవిత్రతకు భంగం వాటిల్లుతుంది. ఇస్లామ్ సంతులనమైన, సంపూర్ణమైన ఏ జీవనవ్యవస్థ గురించైతే చెబుతుందో ఇప్పుడది కానరాకుండా పోయింది. ఇలాంటి పరిస్థితుల్లో ఓ ముస్లిమ్ మహిళ ఉపాధి సంపాదించడంలో ఎలాంటి పాత్రను పోషించగలదు? ఏ యే పరిస్థితుల్లో ఆమె ఉపాధి కోసం ప్రయత్నించాలి? వాటికి ఇస్లామ్ ఏర్పర్చిన పరిధులేమిటి? అన్న విషయాన్ని చర్చించేముందు అసలు ఇస్లామీయ ఆర్థిక వ్యవస్థ ఏమిటో తెలుసుకోవలసి ఉంటుంది

స్త్రీ పురుషులుభయులు ఓ వివాహ బంధంలో ముడివడిన తరువాత ఓ కుటుంబం ఉనికిలోకి వస్తుంది. కుటుంబాల కలయికే సొసైటీ లేదా సమాజం. ఇలా ప్రతి కుటుంబం భవనంలోని ఓ ఇటుకరాయి లాంటిది. ఏ ఒక్క ఇటుక సరిగా అమరకపోయినా ఆ ఇంటి నిర్మాణంలోనే లోపం ఏర్పడగలదు. అయితే ఓ కుటుంబం శిక్షణ సరైన రీతిలో జరుగకపోతే ఓ సత్సమాజం ఉనికిలోకి రాజాలదు. ఓ కుటుంబాన్ని నియంత్రించేందుకు దాని ప్రాథమిక అవసరాలను తీర్చేందుకు, పిల్లల విద్యా శిక్షణల కోసం ఉపాధి అనేది ఎంతైనా అవసరం. కుటుంబంలో భార్యా, భర్త, పిల్లలు, ఒక్కొక్కప్పుడు భర్త తల్లి దండ్రులు, సోదరీసోదరులు కూడా ఉంటారు. వారి పోషణ బాధ్యతను ఎవరు

భరించాలి? వారికోసం భుక్తిని ఎవరు సమకూర్చాలి? పిల్లల చదువు సంస్కారాలకు సంబంధించిన అవసరాలను ఎవరు భర్తీచేయాలి? ఈ ప్రశ్నలన్నింటికి సమాధానం ఇస్లామ్‌లో ఉంది. అది పూర్తిగా పురుషుని బాధ్యతే అంటోంది ఇస్లామ్. కుటుంబ స్వరూపాన్ని సంరక్షించేందుకు పురుషుడు ఉపాధికోసం ప్రయత్నించాలన్నది దాని ఉద్దేశ్యం. అలాగే స్త్రీ ఇంటికి సంరక్షకురాలుగా ఉంటూ భర్త సంపాదనను మేలైన రీతిలో కుటుంబంపై ఖర్చుబెడుతుంది. ఈవిధంగా జీవితాన్ని గడిపే ఓ భావనను ప్రసాదించిన ఇస్లామ్, స్త్రీపురుషులు భయులను ప్రకృతికి అనుగుణంగానే మానసికంగా మరియు శారీరకంగా వేరుచేస్తోంది. ఈ పంపకం (Distribution) ప్రకారం, ఇస్లామ్‌ధర్మం ఉపాధి సంపాదనా బాధ్యతను పురుషునిపైన్నే వేసింది. ఈవిధంగా అది పురుషులను సంపాదనకు ప్రోత్సహించింది. స్త్రీకి, ఆమె నైజం ప్రకారం ఇంటి పనులన్నిటిని చక్కబెట్టాలని ప్రోత్సహించింది. ఆమెను పోషణ బాధ్యతనుండి విముక్తురాలిగా చేసింది. ఇలా సభ్యతను నెలకొల్పడంలో స్త్రీ మరియు పురుషులుభయులూ సమానులుగానే ఖరారు చేస్తోంది ఇస్లామ్ ధర్మం. దివ్యఖుర్‌ఆన్ తౌబా అధ్యాయంలో ఇలా ఉంది:

> "విశ్వాసులైన పురుషులు మరియు విశ్వాసులైన స్త్రీలు ఒకరికొకరు సహాయకులు. వారు మంచికొరకు ఆదేశిస్తారు, చెడును నివారిస్తారు"

అయితే ఇస్లామ్ ధర్మం స్త్రీ అసలు సంపాదించడానికే వీల్లేదని అనడం గొప్ప పొరపాటు. ఇస్లామ్ స్త్రీలకు, గడపదాటి బయటకు వచ్చి పనిజేయడానికి, సంపాదించడానికి, ధర్మసమ్మతమైన భుక్తిని పొందడానికి అనుమతినిచ్చింది. అయితే ఈ విషయంలో ఆమె కుటుంబంగాని ఆమె పరివారంగాని నకారాత్మంగా (Negative) ప్రభావితం కాకూడదు. అలాగే ఆమె తన ఇంటి బాధ్యతల నిర్వాహణకు ఎలాంటి అడ్డంకులు కలుగకుండా చూసుకోవలసి ఉంటుంది. ఈ దృష్టికోణంతో గనక చూస్తే స్త్రీలు ఉపాధిని సంపాదించాల్సిందే అని బలవంతం చేయడం లేదా వారు ఉపాధికోసం ప్రయత్నించాలా ప్రయత్నించకూడదా? అనే చర్చ జరిగే అవసరమే ఏర్పడదు. పరిస్థితులకు

అనుగుణంగా ఏ మహిళైనాసరే ఉపాధికి సిద్ధపడితే ఇస్లామ్ ఆమెకు స్వేచ్ఛను ప్రసాదిస్తోంది. అయితే అది ప్రాథమిక బాధ్యతలు ప్రభావితం కాకుండా ఉండాలనే షరతులతో మాత్రమే. అలా జరగని పక్షంలో ఆమె పాపపు అడుగు వేస్తుంది. పురుషుని విషయం అచ్చం అలాంటిదే. అతను ఉపాధి సంపాదన కోసం కృషి చేయక కావాలని సోమరిపోతై ఉండదలిస్తే అతనూ పాపం చేసినవాడే అవుతాడు. ఒకవేళ ఓ కుటుంబానికి సంబంధించిన పురుషుడు ఏదో ఒక ధార్మిక విధి నిర్వహణ కారణంగానో, మరేదైనా అనారోగ్యం కారణంగానో ఇంటి బరువు బాధ్యతలను మోయలేనిపక్షంలో ఆ కుటుంబానికి చెందిన మహిళ సంపాదించే స్తోమత, సామర్థ్యం కలిగి ఉన్నట్లయితే అప్పుడు ఆ ఇంటి ఆడపడుచు ఉపాధి సంపాదనకు కృషి చేస్తుంది. దానికి ఆమెకు ఇబ్బడి ప్రతిఫలమూ లభిస్తుంది. అదేవిధంగా ఓ కుటుంబంలో మగదిక్కు లేకుండా స్త్రీ వితంతువై తన పిల్లల పోషణ భారమంతా తనపైన్నే వేసుకునే అవసరమే ఏర్పడితే అలాంటి సందర్భం లోనూ ఆమె ఉపాధికి ప్రయత్నించవచ్చు. ఈ విధంగా సాధారణ జీవితంలో మహిళలు తప్పనిసరిగా సంపాదించాలనే ఆంక్షలు లేనప్పటికి స్త్రీలు బయటకు వెళ్ళి సంపాదించవలసిన అవసరం ఏర్పడిన ఉదాహరణలు అనేకం మనకు లభిస్తాయి. ఇలాంటి పరిస్థితులు ఎదురైనప్పుడు ఆమె తప్పకుండా సంపాదించ వలసి వస్తే ఇస్లామ్ దానికి పూర్తి అనుమతినిస్తోంది. అదేకాదు, అవసరం ఏర్పడక పోయినా తన శక్తిసామర్థ్యాలను పరీక్షించుకోవడానికి స్త్రీ, తన సామర్థ్యాలకు అనుగుణంగా పనిజేయాలని అనుకుంటే ఇస్లామ్ ఆమెపై ఎలాంటి నిషేధం పెట్టడంగాని, ఉద్యోగం చేయకుండా ఉండేందుకు ఆంక్షలను విధించడంగాని చేయదు.

స్త్రీలు మాత్రమే నిర్వహించే కొన్ని పనులు, కొన్ని కళలున్నాయి. వాటిలో స్త్రీమాత్రమే పాల్గొనగలదు. ఉదాహరణకు కేవలం బాలికల కోసమే ఏర్పర్చబడిన విద్యాసంస్థలు, పాఠశాలలు, కళాశాలలు లేదా సాంకేతిక సంస్థలు, మహిళా ఆసుపత్రులు, స్త్రీలయొక్క ప్రభుత్వేతర సంస్థలు (N.G.Os) వగైరా. వాటిలో స్త్రీలుమట్టుకే ఉపాధ్యాయులుగా, లెక్చరర్లుగా, సాంకేతిక నిపుణులుగా

(Technical Hands) పనిచేసే అవసరం ఏర్పడితే ఆయాసంస్థల్లో వారు చేరవచ్చు. ఇలాంటి అనేక స్త్రీ సంక్షేమసంస్థలూ ఉన్నాయి. అక్కడ స్త్రీలుమట్టుకే పనిజేస్తారు. ఈ పనులన్నింటిని మహిళలే చక్కగా నిర్వహించగలరు. ఒకవేళ ఇస్లామ్ స్త్రీలను బయటకు వెళ్ళి పనిచేయడాన్ని నిషేధించి ఉంటే ఎంత కష్టం ఏర్పడేదో ఊహించండి. ఇస్లామ్ అలా చేయలేదు. సరికదా ఇస్లామ్ ధర్మంలో స్త్రీలకు అస్తిని ఉంచుకునే హక్కును ఎలా ఇచ్చిందో, అలాగే వారికి వ్యాపారం కూడా చేసుకునే స్వేచ్ఛను ప్రసాదించింది. దీనికి భిన్నంగా పాశ్చాత్య దేశాలు స్త్రీని అంగడి వస్తువులా చేసి ఆమెను తమ ఆర్థిక బానిసలు చేశాయి. స్త్రీకి ఓ గౌరవం అంటూ ఉందనే విషయాన్నే విస్మరించాయి. స్త్రీ ప్రకృతిసిద్ధంగా సున్నితమైనది, సుకుమారమైనది. ఆమె కఠినమైన పనులను చేయలేదు. ఎవరైనా ఆమె శక్తికిమించిన భారాన్ని ఆమెపై మోపినట్లయితే అది ఆమెపై దౌర్జన్యం చేయడంలాంటిదే. స్త్రీ యుక్తవయస్సులో ఉన్నప్పటికి, ఆమె గర్భధారణ, ఆ తరువాత ప్రసూతి, ఆ పిదప శిశువుకు పాలుపట్టడం, దానికి తోడు నెలనెలా వచ్చే రక్తస్రావం (Periods) ప్రసూతిస్రావాల బాధలను భరిస్తూ ఉంటుంది. వీటికారణంగా ఆమెకు ప్రశాంతత అనేదే లేకుండాపోతుంది. ఇలాంటి సందర్భాలల్లో ఆమెపై మోపబడే ఇబ్బడి బరువును మోసే క్షమత ఆమెకు ఉండదు. తరచూ ఆమె తన ఆరోగ్యాన్ని కాపాడుకోలేదు. ఇలాంటి సమయాల్లో ఆమెకు పూర్తి విశ్రాంతి అవసరం. ఈ కాలంలో శారీరకంగాను, మానసికంగాను పడే ఈ వత్తిడి (Stress) ఆమెకు నష్టదాయకమైనదే. మానవ సంతతి వృద్ధికోసం ఓ ఆరోగ్యవంతురాలైన తల్లి అవసరం ఎంతైనా ఉంది. ఈ విషయాన్నే ఇస్లామ్ పూర్తిగా దృష్టిలో ఉంచుకోవడం జరిగింది. అయితే, పాశ్చాత్యులు ఈ అంశాన్ని పూర్తిగా విస్మరించారు. ఈ కాలంలోనూ మహిళ, ఇంటా బయటా ఓ యంత్రంగా పనిచేస్తూ తన అవసరాలను పూర్తిచేసుకోవాలంటోంది. 'మహిళా స్వాతంత్ర్యం' అంటూ నినదించేవారు 'ఇది స్త్రీ స్వాతంత్ర్యం కాదు, అదో బానిసత్వం' అనే యదార్థాన్ని పూర్తిగా మరిచిపోయారు. ఆర్థిక స్వేచ్ఛకు బదులు అది అసలు ఓ ఔపాధిక చెరసాల అయిపోయింది. ఇందులో ఆమెను నెట్టడం వలన ఒనగూడే

నకారాత్మక ప్రభావాలను చవిజూస్తున్నారు కూడా. కాబట్టి Betty Freiden లాంటి ఫెమినిస్టులు (Moderate Feminists)సైతం మధ్యేమార్గంలో ఆలోచిస్తూ ప్రస్తుతం చెలామణిలో ఉన్న తీరు పరిణామాలు ఎంతో దురదృష్టకరంగా ఉన్నాయని చెప్పడం జరిగింది. స్త్రీ తనను తాను ఉపాధి బంధనాల్లో బిగించుకొని ఏ త్యాగం అయితే చేస్తోందో అది ఆమె పట్ల అంత సరైందిగా అగుపడడం లేదు. కాబట్టి రెండవశ్రేణికి చెందిన ఫెమినిస్టుల నినాదం ఇప్పుడు Back to Kitchen గా రూపుదాల్చింది. స్త్రీపురుష సమానత్వపు ఈ నినాదాలు ఎన్ని వినిపిస్తున్నప్పటికి స్వయం పశ్చిమదేశాలకు చెందిన పురుషాధికార సమాజం (Male Dominated Society) ఆమెను సైన్యంలో భర్తీ చేయడంగాని, భారీ యంత్రాలను నడిపించడానికిగాని ముందుకు రావడంలేదు. చివరికి సున్నితమైన శస్త్రచికిత్సలలోనూ పురుష డాక్టర్ల సహాయాన్నే అధికంగా కోరడం జరుగుతోంది. ప్రైవేట్ సెక్టర్లు కొన్నిటిలోనైతే కొన్నిచోట్ల నేటికినీ స్త్రీల వేతనాలు పురుషుల వేతనాలకంటే చాలా తక్కువ. అయితే ఈ దేశాలే స్త్రీపురుషుల వేతనంలో తేడాను నేరంగా పరిగణిస్తున్నాయి.

స్త్రీ, పురుషునికి దీటుగా ఉపాధి సంపాదనలో పాల్గొన్నప్పుడు, ఆమె చిన్న పిల్లల బాగోగులు, వారి పోషణా శిక్షణలపై దృష్టిని పెట్టే విషయంలో సమాజంలో ఓ సంఘర్షణ ప్రారంభమవుతుంది. ఈ సమస్యకు పాశ్చాత్య దేశాలు చూబెట్టిన పరిష్కారం, క్రెచెస్ (Creches), ప్లే హౌజెస్ (Play houses)ను నెలకొల్పడం. ఎందుకంటే ఉద్యోగాలు చేస్తున్న మహిళల పిల్లలను ఆఫీసువేళల్లో దాయాలు చూస్తారు. అలా వారు ఎలాంటి బాదరబందీ లేకుండా తమ ఉద్యోగాలను చేసుకోవచ్చు అన్నది వారి భావన. ఈ పరిష్కారాన్ని సర్వసమ్మతమైనది, సులువైనదిగా గుర్తించడం, దాన్ని ఆహ్వానించడమూ జరిగింది. అంటే, మనిషి పిల్లలు, పిల్లలుగాగాకుండా కేవలం నిర్జీవ వస్తువులు, వాటికి కావలి ఉంటే చాలు అనే భావన అన్నమాట. దీనివల్ల ఔపాధిక రంగంలో ఎలాంటి చిక్కులు ఏర్పడకపోయినా, మనిషి పిల్లవాడు ఏదో ఒక జంతువో లేదా ఏదో ఒక ప్రాణంలేని వస్తువో కాదు కదా! శైశవదశనుండే పిల్లల్లో ఓ రకమైన మానసిక పరిస్థితులు

ఏర్పడుతూ ఉంటాయి. తన తల్లి పైటచెంగు పట్టుకొని ఆడడం, తల్లిని అంటిపెట్టుకొని ఉండడం, ఆమె ఒడిలో కేరింతలు కొట్టడం మంకుపట్టడం వగైరా పిల్లల నైజం. ఈ మానసిక పరిస్థితిని క్రమక్రమంగా అణిచివేయడం వలన శిశువులో తీవ్రమైన ప్రతిచర్య ఏర్పడుతుంది. అతనిలో తనవారెవరూ లేరనే భావన పొడుసూపుతుంది. రోజు ఏడెనిమిది లేదా పదిగంటలు తల్లికి దూరంగా ఉండడం వలన పిల్లవాడు తల్లికి దూరంగా ఉన్నట్లే భావిస్తాడు. ఉద్యోగం చేసి తిరిగివచ్చేటప్పుడు తల్లి తన పిల్లవాణ్ణి తప్పకుండా తన వెంటబెట్టుకువస్తుంది కాని, ఆమె ఆ సమయంలో బడలిక వల్ల తన పిల్లవానికి సమయాన్ని కేటాయించలేకపోతుంది. అతని అవసరాలను (Demands), కోరికలను తీర్చేస్థితిలో ఉండదు. దాని నకారాత్మక ప్రభావం పిల్లవానిపై తప్పకుండా పడుతుంది. పిల్లవానిలో ఒంటరితనం భావన మరింత పెరుగుతుంది. ఈ సమయంలో పిల్లవాని తండ్రి ఆ ఖాళీని పూరించడానికి ప్రయత్నం చేసినా అతను తల్లిస్థానాన్ని మాత్రం ఆక్రమించలేడు. ఓ పిల్లవాడు తండ్రిలేకుండా లేదా అతని ఆలనాపాలనా లేకుండా కూడా ఉండగలడు. శైశవదశ నుండే ఆ పిల్లవాని ఆలోచనలు విషపూరితం అవుతూ ఉంటాయి. అతను పెరిగి పెద్దయ్యాక సంఘవిద్రోహశక్తిగా మారిపోవచ్చు. తాను తల్లిదండ్రులకు వేరుగానే ఉండే ప్రయత్నం చేస్తాడు. అలాంటి పిల్లల్లో చిరాకు మరింతగా పెరిగి సమాజంతో కలిగి ఉండవలసిన మేలైన సంబంధాలు తెగిపోతాయి. యుక్తవయస్సుకు చేరిన తరువాత అలాంటి పిల్లల్లో రకరకాల మానసిక వ్యాధులు పుట్టుకొస్తాయి.

ఉపాధి సంపాదన కోసం స్త్రీ మరో త్యాగం కూడా చేస్తూ ఉంది. అది నైతిక త్యాగం. ఇది ఆమె పాలిట కాలకూట విషమే అనవచ్చు. నేడు ప్రపంచ మంతా పురుషుల చెప్పుచేతల్లోనే ఉంది. పురుషుడు స్త్రీని పొందడానికి, ఆమెను ఉపయోగించుకోవడానికి రకరకాల క్రొత్త విధానాలను కనిపెడు తున్నాడు. ఆమెను అడ్డంపెట్టుకొని ఎనలేని లాభాలను గడిస్తున్నాడు. 'మాడల్' పేరున ఒకచోట, బ్యూటీక్వీన్ (ప్రపంచ సుందరి, విశ్వసుందరి)పేరున ఇంకోచోట, సినిమా హీరోయిన్‌ల పేరున మరోచోట సతతం ఆమెను పిచ్చిదానిలా (Fool)

మార్చేస్తున్నాడు. ఈ పాత్రలన్నింటిలోనూ స్త్రీ లైంగికంగా వేధింపబడి దోపిడీకి గురవుతూనే ఉంది. అందుకు ఆమెకు కొంత డబ్బు లభించినా, ఏ పనికోసం అయితే ఆమె ఉపయోగించుకోబడుతుందో దీనిద్వారా వారికివచ్చే ఆదాయం కోట్లలోనే.

ఈ వినియోగ (Consumarism) యుగంలో ఈ పని మరింత నికృష్టమై పోయింది. ఎంతో మెలుకువను ఉపయోగించి లైంగిక ఆకర్షణ (Sex appeal) ద్వారా ఆమె లక్షలాది మంది మనసులను గెలుచుకోగలదంటూ ఆమెను ముందే మానసికంగా సిద్ధం చేయడం జరుగుతుంది. ఆమె అందాన్ని పొగుడుతూ, మాడరన్ గర్ల్‌లాంటి ఖితాబుల వలలో ఆమెను బిగించి హైవేలపై, క్లబ్బులల్లో, డ్యాన్సుబారుల్లో, చిన్నాపెద్దా తెరలపై ఆమెను అర్థనగ్నంగా మరీ చెప్పాలంటే నగ్నంగా చూపడం జరుగుతోంది. ఈ విషయంలో ఎంత తెగువ చూపిన స్త్రీకి విజయపథంలో నడిచే మార్గాలు అంతే సుగమం అయ్యాయి. ఇలా పురుషుడు ఆమెను తన చెప్పుచేతల్లో ఉంచి ఆడిస్తున్నాడు. ఆమె కళ్ళకు గంతలు కట్టాడు. కాబట్టి ఉపాధి సంపాదనా స్వేచ్ఛ పేరుబెట్టి ఆమెను మోసగించడం జరుగుతోంది. ఇటు పెట్టుబడిదారులు, అటు వినియోగదారులు భయులూ ఆమెను దోచుకుంటూనే ఉన్నారు.

చర్చనీయాంశమైన మరో విషయం ఏమిటంటే, "నేటి మానవుని అవసరాలు బాగా పెరిగిపోయాయి. పురుషునితో సహా స్త్రీ కూడా ఉద్యోగం చేయకపోతే ఆ అవసరాలు తీరేవి కావు కాబట్టి స్త్రీ తప్పకుండా ఉపాధి సంపాదనలో పాల్గొనవలసిందే" అన్నది. ఈ ఆలోచనను ప్రచారం చేసింది కూడా పాశ్చాత్య దేశాలే. కాబట్టి దాదాపుగా మూడవ ప్రపంచ దేశాలు (Third World Countries) స్త్రీకోసం ఉద్యోగ సదుపాయాలను సమకూర్చాయి. ఈ పరుగులో మనదేశం కూడా వేగంగా ముందుకెళుతోంది. స్త్రీలు గుంపులుగుంపులుగా ఉద్యోగాల్లో చేరి పురుషులకు తోడుగా నిలుస్తున్నారు. అయితే ఓ చేదునిజం ఏమిటంటే, మనిషి అవసరాల చిట్టా ఎప్పుడూ అంతంకానిది. మనిషిలో మౌలికంగా, అత్యధికంగా సంపాదించాలనే ఆశ ఓ వ్యాధిలా పెరిగిపోవడమే

దానికి కారణం. అతని ఆశ అనే ఆ ఆకలి ఎప్పటికినీ తీరేదికాదు. ఈ భౌతికవాద యుగంలో మనిషి ఎంత సంపాదించినా అతను అంతే దురాశాపరుడై పోతున్నాడు. మనిషి నైజం ప్రకారం గనకజూస్తే మనిషి ఆదాయం, వ్యయం రెండు సరిసమానంగా ఉన్నప్పుడే అతనికి ప్రశాంతత చేకూరుతుంది. వచ్చే సంపాదన, చేసే ఖర్చు రెండూ సమానంగా ఉండాలి. ఒకవేళ స్త్రీ తన ఇంటి నియంత్రణలో నిపుణురాలైతే ఆమె తక్కువ ఆదాయంలోనూ అవసరమైన వస్తువులను సమకూర్చుకోగలదు. దానికి భిన్నంగా స్త్రీపురుషులిద్దరూ కలిసి నాల్గు చేతులా సంపాదిస్తూ ఉన్నా ఆ ఖర్చును నియత్రించేవారు ఎవరు? కాబట్టి ఇలాంటి పరిస్థితుల్లో వారి ఆదాయం తప్పకుండా రెండింతలైనప్పటికీ, దానికితోడు దుబారాఖర్చులు, అనవసరమైన వస్తువుల కొనుగోలులోనే ఆ సంపాదనంతా హరించుకుపోతుంది. నెల పూర్తిగాకముందే ఇలాంటి వారి జేబులు ఖాళీ అయి అప్పు కూడా చేయవలసివస్తుంది.

ఇస్లాం ఉపాధి ప్రాధాన్యతను ఒప్పుకుంటూనే ఈ విషయంలో సమతుల్యమైన వ్యవస్థను అందిస్తోంది. ఉపాధి నుండి స్త్రీని తప్పించడానికి గల కారణం, ఆమె ఏకాగ్రతతో తన ఇల్లు, తన కుటుంబం వగైరాల విధులపైన్నే దృష్టిని మళ్ళించాలనే. స్త్రీ ఎప్పుడైతే ఏకాగ్రతాచిత్తురాలై ఇంటి బాధ్యతలను నిర్వహిస్తుందో ఆ ఇంట శాంతి, ప్రశాంతత, ఆనందం వెల్లివిరుస్తాయి. ఆర్థిక బాధ్యతలనుండి తప్పించబడ్డ మహిళ తన భర్తసొత్తుకు పరిరక్షకురాలవుతుంది అన్న విషయం అంతకంటే మిన్నైన విషయం. ఆమెకు తన భర్త సంపాదనను ఖర్చుబెట్టే పూర్తి అధికారం ఉంది. ఆమె స్వంతంగా ధనవంతురాలైనప్పటికీ ఆమెను పోషించే బాధ్యత భర్తదే. ఇలా ఇస్లామీ కుటుంబ వ్యవస్థలో ఓ స్త్రీ బలవంతంగా ఉద్యోగం చేయడంగాని, మరో వృత్తిని చేపట్టమని వత్తిడి చేయడంగాని జరుగదు. ఆమెకు తన ఇష్టానుసారం పరిస్థితులకు అనుగుణంగా నిర్ణయం తీసుకునే హక్కు, అధికారం ఉంది.

స్త్రీ ఉద్యోగం చేయాలా, వద్దా? అనే ప్రధాన ప్రశ్నకు సమాధానం వెదకడానికి ఒక భారతదేశమే కాదు పూర్తి ప్రపంచమే సతమతమవుతోంది. ఆమె

పూర్తిగా స్వతంత్రురాలుగా ఉండాలని, ఆర్థికంగా స్వతంత్రురాలైనప్పుడే ఆమెకు అసలైన స్వాతంత్ర్యం లభిస్తుందనే నినాదాలు ఓ వైపు మిన్నుమిడుతుంటే మరోవైపు పెద్దపెద్ద త్యాగాలు చేయమనే డిమాండ్ కూడా చేయడం జరుగుతోంది. 'కేరీర్' కోసం తన కుటుంబ జీవితాన్ని త్యజించడం లేదా తన వివాహాన్ని సైతం వాయిదా వేయడం లేదా అసలుకే పెళ్ళి చేసుకోకుండా ఉండడంలాంటి రకరకాల ఆప్షన్స్‌ను ఆమె ముందుపెట్టి ఆమెపై ఒత్తిడిని తీసుకురావడం జరుగుతోంది. ఆసక్తికరమైన విషయం ఏమిటంటే, ఇప్పుడు వివాహాన్ని ఒక బంధకంగా చేసి చూపెడుతున్నారు. ఇలా చూస్తే స్త్రీ స్వాతంత్ర్యం పూర్తిగా హరించబడుతోందని తెలుస్తోంది. దీనికి ప్రత్యామ్నాయం (Alternative) గా ప్రకృతికి విరుద్ధమైన రకరకాల కృత్రిమ విధానాలు చూపించడం జరుగు తోంది. వాటి ద్వారా ఆమె తన లైంగిక కోరికలను తీర్చుకోవచ్చు. ఇదే కాదు ఆమె తాత్కాలికంగా తన భర్తనూ ఎంపిక చేసుకోవచ్చు. పెళ్ళికాకముందే తల్లయి Single Parenthood అనుభూతిని పొందవచ్చు. ఓ భర్త బానిసత్వం నుండి ఈ రకంగా ఆమె విముక్తిని పొందవచ్చు. ఎందుకంటే ఆమె స్వయంగా సంపాదించి తననుతాను పోషించుకోగలిగే స్థితిలో ఉందికాబట్టి. తాత్కాలిక ప్రాతిపదికపై పెళ్ళాడిన భర్తద్వారా ఆమెకు ఒకరిద్దరు పిల్లలు కలిగితే వారిని ఆమె పెంచి పోషించుకోగలదు. తన ఇష్టానుసారం తానే ఆ పెళ్ళి ఝుంజాటం నుండి బయట పడి స్వయంగా జీవితం గడపగలదు. ఇలాంటి ప్రయోగాలు అనేకం పాశ్చాత్య దేశాల్లో జరిగాయి, జరుగుతున్నాయి కూడా. భర్తగాని, పిల్లలుగాని లేకుండానే తాను స్వయంగా జీవించగలుగుతుంది అనే మానసిక భావనను ఆమెలో కలుగజేయడం జరుగుతోంది. వీరి ఉనికి ఆమె స్వాతంత్ర్యానికి ప్రతిబంధకం కదా మరి! ఒకవేళ ఆమె పెళ్ళి చేసుకున్నప్పటికీ తన కుటుంబాన్ని తన లెక్క ప్రకారమే ప్లాను చేసుకోగలదు. అలా చేసుకోలేకపోయినా, సురక్షిత లైంగిక సంబంధాలను (Safe sex) ఏర్పర్చుకోవచ్చు. బజారులో ఇలాంటి కొంగ్రొత్త ఉపకరణాలు (Contraceptives) అనేకం లభిస్తున్నాయి. వీటిని కౌమారదశలో ఉన్న బాలబాలికలు అనవసర గర్భధారణ నుండి సురక్షితంగా ఉండడానికి

ఉపయోగిస్తున్నారు. దీనివల్ల ఈ నవయువతరం నాశనమై పోవడమే కాకుండా రకరకాల వ్యాధులు ప్రబలుతున్నాయి. జనసంఖ్య రేటు పడిపోతోంది. ప్రపంచం ఎదుర్కొంటున్న మరో క్లిష్ట సమస్య ఇది. జనసంఖ్య రేటు పడిపోవడం ఓ తీవ్రమైన సంక్షోభానికి నాందీ వాచకం. సామాజికశాస్త్రజ్ఞులు (Socialogists) ఈ ఉపద్రవాన్ని కొంతవరకు పసికడుతున్నప్పటికి దానికి సరైన పరిష్కారాన్ని చూయించలేక పోతున్నారు. ఈ ఉపద్రవం ప్రారంభం అయింది స్త్రీ ఉద్యోగ పర్వంనుండే. ఆదాయవనరుల ద్వారా జీవితంలో అనవసర ఐశ్వర్యం పెరిగి పోయినప్పటికి దానికితోడు మనిషి రకరకాల చిక్కుల్లో చిక్కుకుపోతున్నాడు. వివాహ బంధంలో బంధించబడిన భార్య ఉద్యోగం చేయాలని పట్టుబట్టినచోటే ఇంటి బాధ్యతలను ఇప్పుడు పురుషుడే నెత్తికేసుకోవలసి వస్తుందన్నది ఓ సమస్య. అతనే పిల్లల్ని సాకాలి. కిచన్ పనులన్ని తానే చేయాలి. పిల్లల నాప్‌కిన్స్ కూడా తానే మార్చాలి. శిశువుకోసం పాలసీసాను తానే సిద్ధం చేయాలి. ఎందు కంటే ఉద్యోగం చేసే స్త్రీకి విశ్రాంతి అవసరం కాదా! అతి తక్కువమంది పురుషులు మాత్రమే దీన్ని ఒప్పుకోవడానికి సిద్ధపడతారు. పురుషాహంకారం (Male ego) వారికి అడ్డం వస్తుందికాబట్టి అదేకాదు, ఇంట్లో చిన్నచిన్న విషయాలపై పోట్లాట, ఒకరినొకరు అనుమానాస్పద దృష్టితో చూడడం, ఎత్తిపొడుపులు వగైరాలు ప్రారంభం అవుతాయి. అంతవరకేకాదు, అవి పెరిగి పెద్దవై కుటుంబ కలహాలకు దారితీస్తాయి. అలా చీటికిమాటికి 'తలాక్' వరకు వెడుతుంది వ్యవహారం. పరస్పరం వేరుబడిపోవడానికి (Seperation) కోర్టుల చుట్టూ తిరిగే పరిస్థితి ఏర్పడుతుంది. అలా కుటుంబ వ్యవస్థ ఛిన్నాభిన్నమై పోతుంది. నేడు మానవుడు డబ్బు తయారు చేసే యంత్రంగా మారిపోయాడు. భావోద్రేకాలకు విలువే లేకుండాపోయింది. బంధుత్వాలు ఇప్పుడు డబ్బు ప్రాతిపదికపైన్నే ఏర్పడుతున్నాయి. మొత్తానికి ప్రతి మనిషి తన విషయంలో స్వార్థపరుడై పోయాడు.

'బలవంతపు మహిళా ఉద్యోగం' అనే అంశాన్ని దృష్టిలో ఉంచుకొని జూస్తే మనకు కానవచ్చేది ఒకే ఒక సూచన. అది సమాజ పతనం. ప్రతి

స్థాయిలోనూ స్త్రీపురుషులుభయులు పరస్పరం వ్యతిరేకపార్టీగా నిలుస్తున్నారు. ఇది ఓ శాశ్వితమైన సంఘర్షణ. స్త్రీ కావాలనో, అనుకోకుండానో ఆ సంఘర్షణకు గురవుతూ ఉంది. కారణం ప్రపంచంలో జరిగే ప్రతి పనిలోనూ పురుషునిదే పైచెయ్యిగా ఉంటూ వస్తోంది. ప్రతిరంగం (Sector)లోనూ ఆమె నియంత్రణా త్రాడు మగవాని చేతిలోనే ఉంది. అందువలన ఆమె ఎంత ప్రయత్నించినప్పటికి ప్రగతిని సాధించలేకపోతోంది. దానిద్వారా వచ్చే ఫలితం ఏమిటి? ఇంటి ప్రశాంతత మంటగలిసిపోవడం, పిల్లలు చెడిపోవడం, వారు శారీరకంగా, మానసికంగాను దివాలా తీస్తున్నారు. పాశ్చాత్య దేశాల్లో ఇలాంటి ఉదాహరణ లెన్నో మనకు కానవస్తాయి. అలాగే ఆ దేశాల అనుకరణ సాగుతున్న ప్రతి దేశంలోనూ ఈ పరిస్థితి త్వరలోనే బయటపడగలదు.

ఇస్లామ్ జీవన వ్యవస్థ సమగ్రతను దృష్టిలో ఉంచుకొని ఈ విషయాలను పరిశీలిస్తే దివ్యఖుర్‌ఆన్, స్త్రీకి ఉపాధి సంపాదించే బాధ్యతనుండి విముక్తిరాలిగా చేసి కేవలం ఆమెను ఆదుకోవడమేకాకుండా మొత్తం సమాజాన్నే అస్థవ్యవస్థకు గురికాకుండా చేసింది అనే యదార్థం తేటతెల్లమవుతుంది. ఆమె ఉపాధి సంపాదనలో ఎక్కడైనా నిమగ్నమైపోయినా, ఆమెకు కొన్ని పరిధులలో, ఉపాధిని పొందే అనుమతినిస్తోంది. దీనివల్ల సమాజం అసంతులనానికి గురికాజాలదు. ఈ హద్దులను పరిరక్షించడం ముస్లిమ్ స్త్రీ విధి అయిపోతుంది. ఉదాహరణకు ఆమె తన ఇంటి ఆర్గనైజర్. భర్త సొత్తుకు పరిరక్షకురాలు. తన పిల్లల బాగోగులను చూస్తూ వారిని తీర్చిదిద్దే సంరక్షకురాలు. అందుకని ఆమె యొక్క ఆ మౌలిక బాధ్యతలు ప్రభావితం అయ్యే మరే పనిలోనూ ఆమె నిమగ్నం అయిపోవడం సరైందికాదు.

కుటుంబ వ్యవస్థలో స్త్రీని పురుషునికి సహకారిణిగా చేయడం జరిగింది. అంటే దీని అర్థం ఆమె పురుషునికంటే తక్కువ అని ఏమాత్రంకాదు. అది కుటుంబ వ్యవస్థ సక్రమంగా నడవడానికే. ఆ వ్యవస్థలో ఎలాంటి లోటుపాట్లు రాకుండా ఉండాలనే ఉద్దేశ్యమే అది. అలాగే, ఆమెపై ఖర్చుపెట్టాలని పురుషునికి ఆదేశం కూడా ఇవ్వబడింది. దివ్యఖుర్‌ఆన్‌లో భార్యాభర్తలిద్దరిని ఒకే

జాతివారిగా చెప్పి వారి బంధం యొక్క ఉద్దేశ్యం ఏమిటో స్పష్టంగా వివరించడం జరిగింది.

**"ఆయన సూచనలలో మరొకటి ఏమిటంటే, ఆయన మీ కొరకు భార్యలను మీ జాతినుండే సృష్టించాడు- మీరు వారి వద్ద శాంతిని పొందడానికి, మీ మధ్య ప్రేమను, కారుణ్యాన్నీ సృజించాడు." (అర్‌రూమ్- 21)**

పురుషుణ్ణి ఇంటి సంరక్షకునిగా చేయడం వలన అతని యాజమాన్యం కారణంగా ఇంటి వ్యవస్థ సక్రమంగా నడవగలదని చెప్పబడింది.

**"పురుషులు స్త్రీలకు అధికారులు (ఖవ్వామ్), ఎందుకంటే అల్లాహ్ వారిలో ఒకరికి మరొకరిపై ఆధిక్యతను ప్రసాదించడం వల్ల, ఇంకా పురుషులు తమ సంపదను వారికొరకు ఖర్చు చేస్తున్నందువల్ల." (అన్‌నిసా-34)**

అయితే, ఇంత చెప్పబడినప్పటికి అన్‌నిసా సూరాలోనే దివ్యఖుర్‌ఆన్, ఉభయులు సంపాదించిన సంపాదన లేదా ఆస్తిపై వారికి వేరువేరుగానే యాజ మాన్య హక్కులుంటాయని చెబుతోంది.

**"పురుషులు సంపాదించిన దానికి తగినట్లుగా వారి భాగం ఉంటుంది. స్త్రీలు సంపాదించిన దానికి తగినట్లుగా వారి భాగం ఉంటుంది." (అన్‌నిసా: 32)**

పైన చెప్పిన ఈ బలహీనతలు పెరిగి పెద్దవై వ్యాప్తిలోకి రాకముందే అవి ఎక్కడినుండి పుడుతున్నాయో, ఏ మార్గాల ద్వారా వస్తున్నాయో ఆ మూలాలను, ఆ మార్గాలను మూసివేయడం ఇస్లాం ప్రత్యేకత. స్త్రీ తన భర్తకు సహకారిణి కావడం వలన ఆమె తన భర్త అనుమతితోనే ఉద్యోగం చేయాల్సి ఉంటుంది. కుటుంబ వ్యవస్థ పటిష్టతకోసం ఇది ఎంతో అవసరమైన అంశం. దానికితోడు ఆమెపై ఉన్న మరో ముఖ్యమైన ఆంక్ష ఏమిటంటే, ఎలాంటి పరదా నిబంధన లేకుండా స్త్రీపురుషులు విచ్చలవిడిగా, కలివిడిగా పనిచేసేచోట్ల ఆమె పనిచేయడానికి వీల్లేదు. ఇస్లామ్ నిర్ణయించిన పరిమితులు, హద్దుల్లో ఉంటూ ఓ ముస్లిమ్ స్త్రీ ఆదాయాన్ని సమకూర్చే పనులన్నీ చేయగలదు. ఆమె సంపాదించిన సంపాదనంతా ఆమెకే సొంతం.

ఈ పరిధులు అమలు చేయలేనంత కష్టమైనవేవీ కావు. వీటిని ముస్లిమ్ మహిళలు ఇదివరకు అమలుచేసినవే. ఇప్పుడూ అమలుచేస్తున్నారు. ప్రవక్త(స) వారి హయాములోనైతే వీటికి సంబంధించిన అనేక ఉదాహరణలు మనకు కానవస్తాయి. స్త్రీలు తమ బాధ్యతలకు ప్రాధాన్యతనిస్తూనే వాటిని నెరవేర్చడంలో ఎలాంటి లోటును రానివ్వలేదు. దానికితోడు వారు అవసరం వచ్చినప్పుడు తమ ఇష్టం మరియు స్తోమతలమేరకు ఏదో ఒక వృత్తిని చేబట్టడంగాని, ఏదో ఓ వ్యాపారం చేసి ధనాన్ని ఆర్జించడం గాని చేసిందే. వచ్చిన ఆదాయాన్ని తమ ఇష్టప్రకారం ఖర్చుకూడా చేశారు. అవసరం ఏర్పడినప్పుడు (అంటే తన భర్త ధార్మిక ప్రచారంలో నిమగ్నమై ఉన్నప్పుడు) తమ కుటుంబ బాధ్యతలను కూడా తమ నెత్తిపై వేసుకున్నారు.

మహాప్రవక్త(స) వారి కాలం ఇలాంటి ఉదాహరణలతో ఉండింది. స్త్రీలు ఆ కాలంలో పొలాలు, తోటల్లో పనిచేయడం తప్పుగా భావించబడేదికాదు. వారు గంపనెత్తికెత్తుకొని తమ సామానులను బజారుల్లో తిరిగి అమ్మారు. చివరికి యుద్ధంలో క్షతగాత్రులైన వారికి నీరు అందించడం, వారి గాయాలకు చికిత్స చేయడంలాంటి పనులను చేస్తూ కానవచ్చేవారు. అవసరం ఏర్పడినప్పుడు మహిళలు ఆయుధాలను కూడా చేబట్టి యుద్ధం చేశారు. ఆ కాలంలో స్త్రీలు ఒంటరిగానో లేదా ఇతరుల భాగస్వామ్యంలోనో వ్యాపారం చేసేవారు. ఆ కాలంలో వారు చేసే పనులను ఎవ్వరూ తక్కువ దృష్టితో చూడలేదు. వారు విద్యా, సాహిత్యపరమైన విధుల్ని కూడా నిర్వహించారు. తమ సొత్తును, ఆస్తిని ఎలా పరిరక్షించుకోవాలో బాగా తెలిసినవారు. వారు చేసే పనుల్లో వేటికీ ఆటంకం కలగలేదు. పవిత్రమైన ధ్యేయం కోసం, సత్కార్యాల కోసం స్త్రీ సులువుగా బయటకు వచ్చి కృషి చేసేది. హ|జత్ జాబిర్ బిన్ అబ్దుల్లా (ర)గారి పిన్నమ్మ (తల్లి సోదరి) తలాక్ పొంది ఇద్దత్‌లో ఉన్నారు. ఆ ఇద్దత్ కాలంలో ఆమె ఖర్జూరపు చెట్లను కొట్టి వాటిని విక్రయించడానికి ప్రయత్నిస్తే, ఒకాయన ఆమెను అలా చేయకూడదు అని గట్టిగా వారించడం జరగింది. ఆమె దైవప్రవక్త(స)వారి సన్నిధికి వెళ్ళి తాను అలా ఖర్జూరపు చెట్టు కొట్టి విక్రయించవచ్చా లేదా? అని అడిగారు. అప్పుడు దైవప్రవక్త(స) ఆమెకు చెప్పిన సమాధానం ఇలా ఉంది:

"పొలానికి వెళ్ళు. నీ ఖర్జూరపు చెట్లను కొట్టు (వాటిని విక్రయించు) వచ్చే డబ్బుతో నీవు బహుశా ఏవైనా దానధర్మాలు గాని, మరే సత్కార్యాలుగాని చేయవచ్చు. (ఇలా నీకు పరలోకంలో మంచి ప్రతిఫలం లభించవచ్చు)."

(అబూదావూద్, కితాబుత్తలాఖ్)

ఇలాంటి మరో సంఘటన మనకు బుఖారి గ్రంథం 'కితాబున్నికాహ్' లోనూ లభిస్తుంది. అది ఇలా ఉంది.

హజ్రత్ అబూబక్ర్(ర)గారి కుమార్తె హజ్రత్ అస్మా(ర)గారు చెప్పిన దాని ప్రకారం హజ్రత్ జుబైర్(ర) ఆమెను పెళ్ళాడిన తరువాత ఆమె ఆయనకు సహాయం చేస్తూ ఉండేవారు. అలాగే తమ ఇంటిపనులను కూడా చక్కబెడుతూ ఉండేవారు. కారణం, హజ్రత్ జుబైర్(ర) గారి దగ్గర ఏ నౌకరు లేడు, మరే ఒంటె కూడా లేదు. అందుకని ఆమె స్వయంగా ఆయన గుర్రానికి మేతవేసి నీళ్ళుత్రాగించేవారు. అలాగే నుయ్యినుండి నీళ్ళుతోడేవారు. ఆమె పొలంనుండి ఖర్జూరాలను గంపనెత్తుకొని మోసుకొచ్చేవారు.

వ్యాపార రంగంలోనూ స్త్రీలు ఆ కాలంలో ఎంతో ముందంజలో ఉండే వారు. చిన్నాపెద్దా వ్యాపారాలన్నింటిలో ఆనాటి స్త్రీలు పాల్గొనేవారు. ఇదో సాధారణ విషయం. హజ్రత్ ఖుదైజా(ర) ఓ పెద్ద వ్యాపారస్తురాలు. ఇంపోర్టు, ఎక్స్‌పోర్టు వ్యాపారం చేసేవారు. తన వ్యవహారాలన్నిటిని ఆమె స్వయంగా మేనేజ్ చేసేవారు. హజ్రత్ సౌదా(ర)కు చేతివృత్తిలో మంచి నైపుణ్యం ఉండేది. తోలును ఎండబెట్టి కమామిషు చేసేవారు. మనం ఆ పనిని ఈ రోజుల్లో చర్మనైపుణ్యం లేదా Leather Technology గా పిలుస్తున్నాం. హజ్రత్ ఆయిషా సిద్దీఖా(ర) మంచి విద్యావేత్త మరియు వక్త. అదేకాకుండా మంచి వైద్యురాలు కూడా. ధార్మిక విద్యలో ఆమెకు మంచి నైపుణ్యం ఉండేది. ఆమె చరిత్ర, కవిత్వం, సాహిత్యం తెలిసిన వారే కాకుండా గొప్ప విద్యాధికురాలు కూడా. హజ్రత్ అబ్దుల్లా బిన్ మస్ఊద్‌గారి భార్య వృత్తి విద్య ద్వారా తన భర్త, పిల్లల ఖర్చులను భరించేవారు. ఓ రోజు ఆమె దైవప్రవక్త(స) వారి వద్దకు వెళ్ళి ఇలా విన్నవించుకున్నారు.

"నేనో వృత్తిపని తెలిసిన స్త్రీని. వస్తువులను తయారుచేసి అమ్ము తుంటాను. (దాని ద్వారా నేను సంపాదిస్తున్నాను). నాభర్త గారు మరియు నా పిల్లల వద్ద ఏదీలేదు. (అంటే ఏదీ సంపాదించే స్థితిలో లేరు) మరి నేను నా సంపాదనను వారిపై ఖర్చుపెట్టవచ్చా?" అని అడగగా దైవప్రవక్త(స) ఆమెకు ఈవిధంగా సమాధానం ఇచ్చారు.

"ఔను! (వారిపై అలా ఖర్చుపెడితే) నీకు పుణ్యం దక్కుతుంది."

(తబ్ఖాతె ఇబ్నె సఅద్)

నేటికి పదనాల్గువందల సంవత్సరాల క్రితం ప్రవక్త(స)గారి హయాంలో ఏ ఇస్లామీయ సమాజం అయితే నెలకొన్నదో ఆ సమాజంలో స్త్రీపై అసహజమైన ఎలాంటి వత్తిడిగాని, అడ్డంకులుగాని లేవు. అలాగే ఆమెపై ఎలాంటి అనవసర మైన ఆంక్షలూ విధించబడలేదు. ఒకవేళ ఏదైనా సమస్యకు పరిష్కారం కావలసి వస్తే వారు స్వయంగా దైవప్రవక్త(స) వద్దకువెళ్ళి ఆ సమస్యకు పరిష్కారాన్ని పొందేవారు.

నాటికీ, నేటికి ఎన్ని వందల సంవత్సరాల అంతరం ఉందో ఆలోచిం చండి? అయిన్పటికి ఆనాటి స్త్రీలు సాధించిన పురోగతి నేడు మనకు కాన రావడంలేదు. ముస్లిమ్ సమాజమైనా, ముస్లిమేతర సమాజమైనా, రెంటిలోనూ స్త్రీ సునాయాసంగా తన స్థానాన్ని నిలబెట్టుకోవడం, తన వ్యక్తిత్వాన్ని సంరక్షించు కుంటూ, తన శీలాన్ని, గౌరవాన్ని కాపాడుకుంటూ ముందుకు వెళ్ళడం సాధ్య మయ్యేదేనా? ఆ విషయం అంతవరకే పరిమితంగా లేదు. నేటి సమాజంలో పెత్తనమంతా పురుషులదే. పురుషులు తమ అహంకారాన్ని త్యజించడంగాని, తమ ప్రయోజనాన్ని వదులుకోవడం జరగడంలేదు. స్త్రీ ఎక్కడైతే ఉద్యోగం చేస్తుందో అక్కడ కూడా ఆమె లైంగిక వేధింపులకు గురవుతోంది. చదువుకునే కాలేజీల్లోనూ, బిజినెస్ సెంటర్లలోనూ ఆమె ఈవ్‌టీజింగ్‌కు గురవుతోంది. ఆమె పనిచేసేచోట్ల (Work Places) భయాందోళనకు, హింస (Harrassment)కు గురికావలసివస్తోంది. అనేక అగౌరవమైన మాటలను సహించాల్సి వస్తోంది. అయిష్టంగానే ఆమె చిరునవ్వులను చిందించాల్సి వస్తోంది. అయినప్పటికి

ఆమెకు పురుషునిలా ప్రగతి లభించడంలేదు. ఒంటరిగా తాను తన పనిని చేసుకుపోయే ధైర్యం అయితే ఆమెలో వచ్చేసిందిగాని పురుషాధిక్య ఈ ప్రపంచంలో ఆమె వారితో ఇప్పటికినీ పోటీ పడలేకపోతోంది. తన వ్రీడను, సిగ్గును, బిడియాన్ని వదిలేసినప్పటికీ ఆమె పురుషుల కీచకవాంఛలనుండి తనను తాను రక్షించుకునేంతవరకు ఎదగనే లేదు. నేటి స్త్రీ పురుషునిగా జీవించాలనే ప్రయత్నం చేస్తున్నమాట నిజమే కాని దాని ఫలితంగా ఆమె మానసిక, శారీరక యాతనలను భరించడం తప్పడంలేదు. స్త్రీత్వాన్ని త్యాగం చేసినా ఆమెకు దక్కింది ఏదీలేదు. ప్రతిచోటా ఆమెకోసం Harrassment ప్రమాదం పొంచుకునే ఉంది. ఆ ప్రమాదాన్ని ఎదిరించడం కోసం ఆమె పురుషుల వస్త్రధారణను అవలంబిస్తోంది. తనను తాను రక్షించుకునేందుకు మార్షల్ ఆర్ట్సను కూడా నేర్చుకుంది. అయినా వాటిలో ఆమె నూటికి నూరు శాతం విజయం సాధించలేకపోయింది.

ఉద్యోగమే నేటి స్త్రీకి బలమైన ఆయుధం. మధ్యతరగతి యువతులు ఉద్యోగం మాధ్యమంగా తమ జీవితాలను కొంతవరకు ఆకర్షణీయమైనవిగా తీర్చిదిద్దుకుంటున్నారు. అదేకాదు, ఈ ఉద్యోగం వారిని ఇంటినుండి బయటకు వెళ్ళే అవకాశాన్ని సాకులను కలిగిస్తుంది. దానిద్వారా వారికి తమ అందచందా లను మరింత పెంచుకునే అవకాశం కూడా లభిస్తోంది. ఆమె అటువైపుకు మొగ్గుచూపేదికూడా అందుకోసమే. కాని ఇది ఆమె పట్ల ఓ పెద్దపరీక్ష లాంటిది. పనిచేసే స్త్రీ కేవలం తన డ్యూటీనే నిర్వహించటంలేదు. ఒక్కొక్కప్పుడు కొంత మంది తన బాస్‌ను సంతోషపెట్టడానికి వారి లైంగిక కోరికలను తీర్చిన సంఘ టనలూ ఉన్నాయి. అలాంటివాటిని ఏ స్త్రీ కూడా బయటకు చెప్పుకోదు. అయి నప్పటికి ఆమెను మాటిమాటికి తిట్టడం, ఉద్యోగంలో నుండి తీసివేస్తానని బెదిరించడం, జీతంలో కోతగోస్తానని భయపెట్టడం బాస్ అలవాటు. ఏదో కొంత ప్రత్యక్ష ప్రయోజనంకోసం ఇంత పెద్ద నష్టాన్ని కొని తెచ్చుకోవడం ఎక్కడి వివేకం?

నేటి ఆధునిక సమాజం తనను ఎంత ఉన్నతమైన సమాజంగా చెప్పుకుంటున్నప్పటికీ మహిళకు ఆమె సొంత ఆదాయంపై ఎలాంటి హక్కును

కల్పించడంలేదు. ఆమె ఆదాయం పూర్తిగా భర్త ఆదాయం క్రిందికే వస్తుంది. ఆమె కోరుకున్నా, కోరుకోకపోయినా ఆమె సంపాదన, ఆమె వేతనం తప్పనిసరిగా ఆమె కుటుంబంలోని ఇతర సభ్యుల పరం కావలసిందే. ఒక ఇస్లాం సమాజం తప్ప మరే సమాజమైనా, ఆమె ఆదాయాన్ని లేదా వేతనాన్ని సొంతం అని భావించదు. ఇస్లామ్ ధర్మం ఒక్కదానిలోనే స్త్రీ సంపాదించిన సంపాదన నూటికి నూరుపాళ్ళు ఆమె ఆస్తిగా పరిగణించబడుతుంది. ఆ సంపాదనను ఖర్చుపెట్టే అధికారంగాని, హక్కుగాని ఆమె భర్తకు కూడా లేదు. సరికదా, భర్త సంపాదించిన సంపాదనలో లేదా వేతనంలో ఆమెకు పూర్తి హక్కు ఉంటుంది. స్త్రీ యొక్క ఆర్థిక పోషణకు సంబంధించిన మేలైన ఉదాహరణ ఇంతకంటే మరే సమాజంలోనైనా లభిస్తుందా?

ఆమె గౌరవానికి సంపూర్ణ సంరక్షణనిస్తూనే, యాజమాన్య హక్కులనిచ్చి ఆమెను మరింత దృఢతరం చేసింది ఇస్లామ్ ధర్మం. ఇకపోతే, ముస్లిం సమాజ వ్యవహారం. నేటికాలంలో ఇస్లామీయ చట్టాలను, ఆదేశాలను పూర్తిగా భంగ పర్చడం జరుగుతోంది. అందుకు బాధ్యత ఇస్లామ్ ధర్మానిదేమాత్రం కాదు. ప్రస్తుతం నడుస్తున్న తీరును చూసి, ఇస్లామ్ స్త్రీలను ఆర్థికంగా బలహీన పరుస్తోంది అని ఎవరైనా అంటే వారి వాదన ఎంతవరకు సమంజసమవుతుంది?

ముస్లిమ్ స్త్రీ అయినా, ముస్లిమేతర స్త్రీఅయినా డబ్బు సంపాదించాలనే తాపత్రయంలో నేటి మహిళ చేయనికృషి అంటూ లేదు. అయితే ముస్లిమ్ స్త్రీల ట్రాజడీ ఏమిటంటే, ఎంతో కొంత చదువుకున్నవారు కూడా ఇస్లామ్ మరియు ఇస్లామీయ సూత్రాల విషయంలో ఏదో ఒక న్యూనతా భావానికి లోనై ఉండడం. ఇలాంటి సందర్భంలో వారికి ఇస్లామ్ గురించి సరైన అవగాహనలేక ఎవరో ఒకరు చెప్పిన తప్పుడు మాటలను ఇస్లామ్ ధర్మంతో ముడిపెడతారు. అందుకని ఇలాంటి స్త్రీలు ముందుకొచ్చి ఇస్లామ్ ధర్మాన్ని చెడురీతిలో ప్రజలముందు ప్రదర్శిస్తూ ఉంటారు. వీరు ఇస్లామ్ గురించి, అది స్త్రీని పురుషులతో సమానంగా నిలబెట్టడానికి ఒప్పుకోని, దాని కఠినమైన చట్టాలు, సూత్రాల కారణంగా ఓ ముస్లిమ్ మహిళ ఈ ఆధునిక యుగంలో ప్రగతిని సాధించలేదు అని తప్పుడు ప్రచారం చేస్తూ ఉంటారు.

ప్రస్తుతం ఈ ఆధునిక కాలంలో ఓ ముస్లిమ్ స్త్రీ తన ఇస్లామీయ విలువలను కాపాడుకుంటూ ఉద్యోగం చేసే లేదా స్వతంత్రమైన ఏదో సొంత వృత్తిని చేబట్టే లేదా వ్యాపారం చేసి సంతులనమైన, సురక్షితమైన ముస్లిమ్ సమాజాన్ని నెలకొలిపే ఛాయలు ఏవీ కానరావడంలేదు. అందుకని ముస్లిమ్ స్త్రీలు తమ వ్యక్తిత్వాన్ని ఎలా కాపాడుకోవాలనే భావనను వారి మెదళ్ళలో స్పష్టంగా జాగృతం చేయవలసి ఉంది. ప్రతిచోటా, ఆడామగా విచ్చలవిడి కలివిడితనం కారణంగా ఏదో ఒక సమస్య ఏర్పడుతూనే వస్తోంది. ఎటుజూసినా అపసవ్యత, నైతికతల పతనమే కానవస్తోంది. ఇలాంటి పరిస్థితిలో ఓ ముస్లిమ్ మహిళ ఇస్లామీయ వస్త్రధారణలో పురుషులకు దూరంగా ఉంటూ ఏ పనిచేయదలచినా కుదరడంలేదు. కాబట్టి ఆమె ఈ ఆధునిక పోకడకే వంత పాడుతూ తన వస్త్రధారణను త్యజించడమే సులువైనదిగా తలుస్తోంది. ఆవిధంగా ఆమె తన ధర్మాన్నే పోగొట్టుకున్నప్పటికి ఆమెకు ఈ భౌతిక ప్రపంచం నుండి లభించేదెంతో మనం చూస్తూనే ఉన్నాం. ఎలాగైతేనేమీ ప్రతి ముస్లిమ్ మహిళ తన గుర్తింపును కాపాడుకునేందుకు, సంపాదించేందుకు ఎలాంటి మార్గాల్ని అవలంబించాల్సి ఉంటుంది అనే విషయాన్ని ఆలోచించవలసిందే.

నేటి విద్యావంతురాలైన ముస్లిం యువతికి ఎదురయ్యే గొప్ప సవాలు (ఛాలెంజి), ఆమె తన ధార్మిక డిమాండ్లకు, హద్దులను, సూత్రాలను సజీవంగా ఉంచుతూ పనిచేయడం, చివరిక్షణం వరకు వాటిని పరిరక్షించే ప్రయత్నం చేయడం. ఈ విషయంలో ఆమెకు ఎంత నష్టం వాటిల్లినా సరే. కాబట్టి అన్నింటి కంటే ప్రధానమైన, ముఖ్యమైన సమస్య ఆమె ఇస్లామ్ చేస్తున్న డిమాండ్లను అర్థం చేసుకోవడం. ఇస్లామీయ చట్టాలను, సూత్రాలను వంటబట్టించుకోవడం. ఆ సిద్ధాంతాల్లో, ఆ పరిధుల్లో ఆమెకోసం ఏయే ప్రయోజనాలు దాగున్నాయో ఆమె తెలుసుకోవాలి. ఇలా విశాలమైన దృక్పథంతో ఆమె ఇస్లామ్ ధర్మాన్నిగనక అధ్యయనం చేస్తే అసలు యదార్థం ఏమిటో ఆమెకు దానికదే బోధపడుతుంది. దానికోసం దివ్యఖుర్ఆన్ మరియు హదీసుల్ని నేరుగా అధ్యయనం చేయాల్సి ఉంటుంది. వాటికితోడు ఈ విషయంపై వివిధ రచయితలు రాసిన రచనలను

కూడా చదవవలసి ఉంటుంది. ప్రస్తుత పరిస్థితుల్లో స్త్రీలు ఏయే అడ్డంకులను ఎదుర్కొంటున్నారో దాదాపుగా అన్ని దినపత్రికలు, మాసపత్రికలు, వారపత్రికలు వివరంగా వ్యాసాలద్వారా తెలియజేస్తున్నాయి. వాటన్నిటిని విమర్శనాత్మక దృష్టితో చదవడం ఎంతో అవసరం. హలాల్, హరామ్‌లలో తేడా ఏమిటి? అనే విషయంలో ఇవ్వబడ్డ దైవాదేశాలను స్త్రీలు తప్పకుండా తెలుసుకోవాలి. ఇస్లామ్ స్త్రీల వ్యక్తిత్వాన్ని ఎలా కాపాడుతుందో దాని స్పష్టమైన భావన వారి మెదళ్ళలో జాగృతం కావాలి. తమ ఆత్మాభిమానం ఎలా పరిరక్షించబడుతుందో ఆ భావన కూడా వారిలో కలగాలి.

భావపరంగా ఎక్కడైనా మహిళలు ఇస్లామీయ దృక్పథాన్ని అలవర్చుకున్నారంటే అది కేవలం దాని సంతులనమైన వ్యవస్థకు ప్రభావితులయ్యే దాన్ని అలవర్చుకోవడం జరిగింది. సిగ్గుమాలినతనం బాగా పెరిగిపోయిన అయిరోపా, అమెరికాల్లాంటి దేశాల్లోనే స్త్రీలు ఇస్లామ్‌ధర్మానికి ప్రభావితులై గుంపులు గుంపులుగా దానివైపుకు ఆకర్షితులౌతున్నారు. వారి జీవితంలో జరుగుతున్న సంఘటనలు, ఇస్లామ్ గురించి వారి ఆలోచన, పరదా మరియు స్త్రీహక్కుల గురించి తెలపడానికి ప్రయత్నం ఎంతైనా జరుగవలసి ఉంది. డబ్బు జీవించడానికి ముఖ్యమైనదే. అయితే ఓ మహిళకు తాను ఓ గౌరవప్రదమైన జీవితం గడపడానికి అవసరమైన సిద్ధాంతాలు అంతకంటే ముఖ్యమైనవి. ఈ విషయాన్ని ముస్లిమ్ స్త్రీలు బాగా అర్థం చేసుకోగలిగితే వాటిని తమ జీవిత సూత్రంగా చేసుకోగలరు.

ఇస్లామీయ విలువలను పరిరక్షిస్తూ, దైవం చూపిన హద్దులలో ఉద్యోగం చేయడం కుదరదు  అని భావించడం కూడా తప్పే. నేటి ఆధునిక యుగంలో స్త్రీలు ఇస్లామీయ సామాజిక విలువలను కాపాడుకుంటూనే ధైర్యంగా ప్రగతిని సాధిస్తున్న దాఖలాలు ఎన్నో మనకు కానవస్తాయి. ఈ విలువలను పరిరక్షిస్తూ ఏ స్త్రీ అయినాసరే చక్కగా పనిచేయగలదు. సంపూర్ణ విశ్వాసం, గట్టినమ్మకం గల స్త్రీలకు ఎన్ని అడ్డంకులు ఎదురైనా వారు ఆ కష్టాలను పూర్తి ధైర్యసాహసాలతో ఎదుర్కొన్నారు.

అవసరం ఏర్పడినప్పుడు లేదా తమ సామర్థ్యాలను పరిరక్షించుకునేందుకు ముస్లిమ్ మహిళ ఏ వృత్తిని అవలంబించినా, ఆ వృత్తిని ఆమె ఖుర్ఆన్ మరియు సున్నత్‌లు చూపిన హలాల్ (ధర్మసమ్మతమైన) మార్గాలననుసరించే అవలంబించాలి. ధర్మసమ్మతంగానే ఆర్జించమని ముస్లిములను ఆదేశించడం జరిగింది. హలాల్ సంపాదన ఎంత తక్కువైనా దానికి తృప్తిపడడం ముస్లిముల అలవాటు. ఓ ముస్లిమ్ మహిళ అన్ని సందర్భాల్లోనూ, ఇస్లామీయ చట్టాలకు తలొగ్గే ఉద్యోగం సంపాదించే ప్రయత్నం చేయవలసి ఉంటుంది. ప్రస్తుతం ఉద్యోగాల్లో అనేక ఆప్షన్స్ వచ్చాయి. వాటిప్రకారం మహిళలు సునాయాసంగా తమ కుటుంబ విధులకు విఘాతం కలుగకుండానే వాటిలో చేరొచ్చు. ఆఫీసుకు వెళ్ళే అవసరం లేని ఇలాంటి ఉపాధి సౌకర్యాలగురించి ఆలోచించే అవసరం ఎంతైనా ఉంది. అలాగే రచనా వ్యాసంగంలో, సాహిత్యంలో స్త్రీలు తమ శక్తిసామర్థ్యాలేమిటో చూయించగలరు. కంప్యూటర్, ఇంటర్‌నెట్ రంగాల్లోనూ స్త్రీలు పరదాలో ఉంటూనే సునాయాసంగా పాల్గొనే అనేక అవకాశాలున్నాయి. బాలికల పాఠశాలలు, మహిళా కాలేజీలు, యూనివర్సిటీలు అలాగే ఆసుపత్రుల్లోనూ వారికి అనేక అవకాశాలున్నాయి. ఇంకా చెప్పాలంటే, ఈ రంగాల్లో వారి అవసరమే అధికం. వ్యాపార రంగంలోనూ మహిళలకు అనేక అవకాశాలున్నాయి. అవి Small Scale Industries అయినా, పెద్ద బిజినెస్, ఎంటర్‌ప్రయిజెస్ అయినాసరే.

పాశ్చాత్యుల పగ్గాలులేని స్వేచ్ఛ ఏవిధంగాను ఆమెకు ప్రయోజనకారి కాదు అని నేటి ముస్లిమ్ స్త్రీ గమనించాలి. పాశ్చాత్యుల 'మహిళా స్వాతంత్ర్యం' అనే నినాదంలో కేవలం డొల్లతనం తప్ప మరేదీలేదు. ఇది స్త్రీని చెడుమార్గంపై బడవేసి ఆమెనుండి ఆమె 'అసలు ధనం' అంటే ఆమె స్త్రీత్వాన్ని లాగేసింది. స్త్రీ తన శీలాన్నే పోగొట్టుకుంటే ఆమె వద్ద మిగిలిందేమిటి!

నేటి ముస్లిమ్ మహిళ, తనకు మిత్రులెవరో, శత్రువులెవరో తెలుసుకోవలసి ఉంది. అందుకు ఆమె ఇస్లామ్ మరియు ఇతర మతాలను విమర్శనాత్మక

దృష్టితో అధ్యయనం చేయాలి. లైంగిక లేదా మానసిక దోపిడి ఉందనే ప్రమాదం ఎక్కడైతే ఆమెకు కనబడుతుందో, అలాంటి చోట ఆమె ఆ దోపిడీకి గురి కాకుండా ఉండేందుకు జాగ్రత్తపడాలి. కొన్ని సందర్భాల్లో ఓ ముస్లిమ్ యువతి తన తీవ్రమైన వైవశ్యం వల్లనో, బలవంతం కారణంగానో, బోలెడు కష్టాలు గల వృత్తిని ఎంపిక చేసుకోవలసి వస్తుంది. అలాంటి పరిస్థితుల్లో ఆమె ముందు ఆలోచించవలసినది ఏమిటంటే, ఈ అశాశ్వత ప్రపంచం యొక్క కొన్నాళ్ళ ప్రయోజనాలా? లేదా అంతకంటే మిన్న అయిన ధర్మం పట్ల విశ్వాసాన్నా? అనేది. ఈ విషయం నిర్ధారణ అయిపోతే ఆమెకు ఎలాంటి కష్టం ఎదురుకాదు. షరీఅత్‌లో ఏ ఆదేశాలైతే ఇవ్వబడ్డాయో వాటిని ఆమె ఎన్నటికిని జవదాట లేదు. కారణం, ఆమె విశ్వాసం అంత గట్టిదిగనుక. ఆమె తన ప్రతి కర్మకు అల్లాహ్ ఎదుట జవాబు చెప్పుకోవలసి ఉంటుందనే నమ్మకం కలిగి ఉంటుంది కాబట్టి.

భుక్తిని ప్రసాదించేవాడు అల్లాహ్ ఒక్కడే అన్నది అసలైన యదార్థం. ఆయన ఎవరికి, ఎంత ప్రసాదించాలో అంత ప్రసాదిస్తాడు. ఎవరి నుండి ఆ భుక్తిని లాక్కోవాలో లాగేసుకుంటాడు. అల్లాహ్ తన షరీఅత్‌కు తోడు ఏది ధర్మసమ్మతం మరేది నిషిద్ధం అనే నిజాన్ని మనిషికి బోధపరిచాడు. హలాల్, హరామ్‌కు చెందిన ద్వారాలన్ని మనముందు తెరుచుకునే ఉన్నాయి. ఇప్పుడు చేయవలసిన పనల్లా హలాల్ మార్గాలనన్వేషించి వాటిని పాటించడం, హరాం వనరుల మార్గాల్ని పరిత్యజించడం. మనకు సరైనవి అయిన మార్గాలను వెదకడమే మన కర్తవ్యం. అప్పుడే దైవం మన పట్ల ప్రసన్నుడై మన జీవితాన్ని సుగమంగా, ప్రశాంతంగా మార్చగలడు ఇన్షాఅల్లాహ్.

❋ ❋ ❋